# భాస్కరశతకము









పబ్లిషరు:

రాఘవరామ్ అండ్ కో.,

బుక్సెల్లరుస అండ్ స్టేషనరుస, బెజవాడ.



ఆంధ్రవాణీ ప్రెస్, బెజవాడ.

వెల ఒక అణా

శ్రీరామాయ నమః

శ్రీ శారదాంబాయై నమః

# భాస్కరశతకము




గలభాగ్యశాలిఁ గడు
జేరఁగవత్తురు తారుదారె దూ
రాగమనప్రయాసమున
కాదట నోర్చియునైన నిల్వ ను
ద్యోగముచేసి రత్ననిల
యుండనికాదె సమస్తవాహినుల్
సాగరుఁ జేరుటెల్ల ముని
సన్నుత మద్గురుమూర్తి భాస్కరా!

ఉ॥ అంగన నమ్మరాదు తనయంకెకురాని మహాబలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెఱుపం దలపెట్టు వివేకియైన సా
రంగధరుం బదంబులు కరంబులు గోయఁగఁజేసెఁ దొల్లి చి
త్రాంగియనేకముల్నుడువరానికుయుక్తులుపన్ని భాస్కరా.

ఉ॥ అక్కఱపాటు వచ్చుసమ • యంబునఁజుట్టములొక్కరొక్కరి
న్మక్కువ నుద్ధరించుటలు • మైత్రికిఁ జూడఁగ యుక్తమేసుమీ
యొక్కట నీటిలో మెరక • నోడలబండ్లును బండ్ల నోడలున్
దక్కఁగవచ్చుచుండుట నిదానముగా డె తలంపభాస్కరా !

చ॥ అడిగినయట్టి యాచకుల • యాశ లెఱుంగక లోభవర్తియై
కడపిన ధర్మదేవత యొ • కానొకయప్పుడు నీదు వాని క
య్యెడలనదెట్లు పాలు తమ • కిచ్చునె యెచ్చటనైన లేగల
న్గుడువఁగనీని-చోఁ గెరలి • గోవులు తన్నునుగాక భాస్కరా!

చ॥ అతిగుణహీనలోభికిఁ బ • దార్థముగల్గిన లేకయుండినన్
మితముగఁగాని కల్మిగల • మీఁదటనైన భుజింపఁ డింపుగా
సతమని నమ్ము దేహమును • సంపద; నేఱులు నిండిపాఱినన్
గతుకఁగజూచుఁగుక్కతన • కట్టడమీరక యెందుభాస్కరా !

చ॥ అదను దలంచికూర్చిప్రజ • నాదర మొప్ప విభుండుకోరినన్
గదిసి పదార్థ మిత్తు రటు • కానక వేగమె కొట్టి తెండనన్
మొదటికిమోసమౌ బొదుగు • మూలముగోసిన బాలుకల్గునే
పిదికినఁగాక భూమిఁబశు • బృందమునెవ్వరికైనభాస్కరా !

చ॥ అనఘునికైనఁ జేకుఱు న • నర్హునిగూడి చరించునంతలో
మనమెరియంగ నప్పు డవ • మానము కీడు ధరిత్రియందునే
యనువుననైనఁదప్పవు య • థార్థము తా నదియెట్లలన్న-చో
నినుమునుగూర్చి యగ్నినల • యింప దెసమ్మెట పెట్టుభాస్కరా!

చ॥ అలఘుగుణప్రసిద్ధుఁ డగు ♦ నట్టిఘనుం డొకఁడిష్టుఁడైన తనున్
వలచి యొకించు కేమిడిన♦వానికి మిక్కిలి మేలుచేయుఁగాఁ
దెలిసి కుచేలుఁ డొక్కకొణి♦దెండటుకుల్ దనకిచ్చినన్మహా
ఫలదుఁడు కృష్ణుఁ డత్యధిక♦భాగ్యములాతనికీఁడె? భాస్కరా!

చ॥ అవనివిభుండు నేరుపరి♦యై చరియించినఁ గొల్చువార లె
ల్లవగుణులైన నేమి పను♦లన్నియుఁ జేకుఱు వారిచేతనే
ప్రవిమలనీతిశాలియగు♦రాముని కార్యము మర్కటంబులే
తవిలియొనర్పవే జలధి♦దాటిసురారులఁ ద్రుంచి భాస్కరా! 9

ఉ॥ ఆదరమింత లేక నరుఁ ♦ డాత్మబలోన్నతి మంచివారికిన్
భేదము చేయుటం దనదు ♦ పేర్మికిఁ గీడగు మూలమెట్లమ
ర్యాదహిరణ్యపూర్వకశి♦పన్ దనుజుండు గుణాఢ్యుఁడైన ప్ర
హ్లాదునకెగ్గుచేసి ప్రళ♦యంబునుబొందఁడె మున్ను భాస్కరా!

ఉ॥ ఆరయ నెంత నేరుపరి♦యైన చరియించినవాని దాపునన్
గౌరవమొప్పఁ గూర్చు నుప♦కారి మనుష్యుఁడు లేక మేలుచే
కూరదదెట్లు? హత్తుగడ♦గూడునె చూడఁ బదాఱువన్నె బం
గారములోననైన వెలి♦గారము కూడకయున్న భాస్కరా!

ఉ॥ ఈక్షితి నర్థకాంక్ష మది ♦ నెప్పుడు పాయక లోకులెల్ల సం
రక్షకుఁడైన సత్ప్రభుని♦రాకలఁ గోరుదు రెందు జంద్రికా
పేక్షఁ జెలంగి చంద్రుఁ డుద♦యించు విధంబునకై చకోరపుం
బక్షులు చూడవేయెదు ర♦పారముదంబునుబూని భాస్కరా!

ఉ॥ ఈజగమందుఁ దా మనుజుఁ♦డెంతమహాత్మకుఁడైన దైవమా
తేజముతప్పఁజూచునెడఁ♦దిమ్మరి కోల్పడు నెట్లన న్మహా
రాజకుమారుఁడై నరఘు♦రాముఁడుగాల్నడఁ గాయలాకులు
న్భోజనమై తగన్వనికిఁ♦బోయి చరింపఁడె మున్ను భాస్కరా!

చ॥ ఉరుకరుణాయుతుండుసమ♦యోచితమాత్మఁదలంచియుగ్ర
వా, క్పరుషతజూపినన్ఫలము♦గల్గుటతథ్యముగాదెయంబుదం
బురిమినయంతనేకురియ♦కుండునె వర్షము లోకరక్షణ
స్థిరతరపౌరుషంబున న♦శేషజనంబు లెఱుంగ భాస్కరా!

ఉ॥ ఉరుగుణవంతుఁ డొల్లు తన ♦ కొండపకారముసేయునప్పుడుం
బరహితమే యొనర్చు నొక♦పట్టుననైనను గీడుఁజేయఁగా
నెఱుఁగఁడు నిక్కమేకద య♦దెట్లనఁగవ్వముబట్టి యంతయుం
దరువఁగఁజొచ్చినంబెరుగు♦తాలిమినీయదె? వెన్న భాస్కరా!

చ॥ ఉరుబలశాలినంచుఁ దను♦నొల్లని యన్యపతివ్రతాంగనా
సురతముఁగోరెనేని కడ♦సు మ్మది భూతికిఁ బ్రాణహానికా
శిరములుగూల రాఘవుని♦చే దశకంఠుఁడు ద్రుంగిపోవఁడే
యెఱుఁగకసీతకాసపడి♦యిష్టుల భృత్యులఁగూడి భాస్కరా!

ఉ॥ ఊరకవచ్చుఁ బాటుపడ♦కుండిననైన ఫలం బదృష్ట మే
పారఁగఁగల్గు వానికిఁ బ్ర♦యాసమునొందిన దేవదానవుల్
వార లటుండఁగా నడుమ♦వచ్చిన శౌరికిఁ గల్గెగాదె శృం
గారపుఁబ్రోవులక్ష్మియును ♦ గౌస్తుభరత్నము రెండు భా. 17

ఉ॥ ఊరకసజ్జనుం డొదిఁగి యుండిననైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యపకారముచేయుట వాని విద్యగాఁ
జీరలు నూరుటంకములు చేసెడివైనను బెట్టె నుండఁగాఁ
జేరి చినింగిపోఁగొఱుకుచిమ్మట కేమిఫలంబు భాస్కరా! 18

ఉ॥ ఎట్టుగఁబాటుపడ్డ నొక యించుక ప్రాప్తములేక వస్తువుల్
పట్టుపడంగనేరవు నిబద్ధ; సురావళిఁగూడి రాక్షసుల్
గట్టు పెకల్చి పాల్కడలిఁ గవ్వముచేసి మథించి రంతయున్
వెట్టియెగాక యేమనుభవించిరివారమృతంబు భాస్కరా!19

చ॥ ఎడపక దుర్గనుం డొరుల కెంతయుఁ గీడొనరించుఁ గాని యే
యెడలను మేలుసేయఁ డొక యించుకయైనను, జీడపుర్వుదాఁ
జెడఁదిను నింతెకాక పుడిసెండు జలంబిడి పెంపనేర్చునే
పాడవగుచున్న పుష్పఫల భూరుహమొక్కటినైన భాస్కరా!

ఉ॥ ఎడ్డె మనుష్యుఁ డేమెఱుఁగు నెన్నిదినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁగల తోరఁపువర్తనలెల్లఁ బ్రజ్ఞఁ జే
ర్పడ్డవివేకరీతి, రుచిపాకము నాలుకగా కెఱుంగునే ?
తెడ్డది కూరలోఁగలయఁ ద్రిమ్మరుచుండిననైన భాస్కరా!

ఉ॥ ఎప్పుడదృష్టతామహిమ యించుకపాటిలు నప్పు డింపుసొం
పొప్పుచునుండుఁగాక యది యొప్పనిపిమ్మట రూపుమాయుఁ
గా, నిప్పుననంటియున్న యతి నిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిన నట్టిబొగ్గునకుఁ దానలు పెంతయుఁబుట్టు భాస్కరా! 22

ఉ॥ ఏగతిఁ బాటుపడ్డఁ గల•దే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖఁ గల•పుణ్యునకుంబలె భూరిసత్త్వసం
యోగము దేభకుంభయుగ•ళోత్థితమాంసము నక్కకూన కే
లాగుఘటించు? సింహము ద•లంచినఁ జేకుఱుఁగాక భాస్కరా!

ఉ॥ ఏడ సమర్థుఁ డుండు నట • కేఁగు ననర్థుఁడు, సమర్థుఁడున్నచోఁ
జూడఁగనొల్లఁ, డెట్లన న•శుద్ధగుణస్థితి నీఁగ పూయముం
గూడినపుంటికైన నిలువఁ • గోరినయట్టులు నిల్వనేర్చునే
సూడిదవెట్టునెన్ను దుటి•చొక్కపుఁ•గస్తురిమీఁద భాస్కరా!

ఉ॥ ఏల సమస్తవిద్యల నొ•కించుక భాగ్యము గల్గియుండినన్
జాలు ననేకమార్గముల • సన్నుతి కెక్కు; న దెట్లొకో యనన్
రాలకు నేడ విద్యలు తి•రంబుగ దేవరరూపు చేసినన్
వ్రాలి నమస్కరించి ప్రస•వంబులు వెట్టరె మీఁద భాస్కరా!

ఉ॥ ఒక్కఁడె చాలు నిశ్చలబ•లోన్నతుఁ డెంతటికార్యమైన దాఁ
జక్కనొనర్పఁ, గౌరవు ల•సంఖ్యులు పట్టిన ధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబలసే•న ననేకశిలీముఖంబులన్
మొక్కపడంగఁ జేసి తుద•ముట్టఁడె యొక్కకిరీటి భాస్కరా!

ఉ॥ కట్టడఁ దప్పి తాము చెడు•కార్యముఁ జేయుచునుండిరేనిఁ దోఁ
బుట్టినవారినైన విడిపోవుట కార్యము; దుర్మదాంధ్యముం
దొట్టినరావణాసురుని•తో నెడబాసి విభీషణాఖ్యుఁ డా
పట్టున రాముఁ జేరి చిర•పట్టముఁ గట్టుకొనండె భాస్కరా!

ఉ॥ కట్టడయైనయట్టి నిజ♦కర్మము చుట్టుచు వచ్చి యేగతిం
బెట్టునొ పెట్టినట్లనుభ♦వింపకతీరదు, కాళ్ళుమీఁదుగాఁ
గిట్టకవ్రేలుఁడంచుఁ దల♦క్రిందుగఁ గట్టిరె యెవ్వరైన నా
చెట్టున గబ్బిలంబులకుఁ ♦ జేరినకర్మముగాక భాస్కరా! 28

ఉ॥ కట్టడలేని కాలమునఁ ♦ గాదు శుభం బొరు లెంతవారు చే
పట్టిననైన మర్త్యునకు ♦ భాగ్యమురా దనుటెల్లఁ గల్ల కాఁ;
జెట్టనిపల్కినన్ దశర♦థేశవసిష్ఠులు రామమూర్తికిన్
బట్టముఁ గట్టఁగోరి రది ♦ పాయక చేకుఱె నోటుఁ భాస్కరా!

ఉ॥ కానక చేరఁ బోలఁ డతి♦కర్ముఁడు నమ్మిక లెన్ని చేసినం
దా నదినమ్మి వానికడ♦డాయఁగఁబోయిన హానివచ్చు న
చ్చో నది యెట్లనంగ నొఱఁకు♦చూపుచునొడ్డినబోను మేలుగా
బోనని కానకాసపడి♦పోవుచుఁ గూలదె కొక్కు భాస్కరా!

ఉ॥ కానిప్రయోజనంబు సమ♦కట్టదు తా భువి నెంతవిద్యవాఁ
డైనను దొడ్డరాజుకొడు♦కైన నదెట్లు మహేశుపట్టి వి
ద్యానిధి సర్వవిద్యలకుఁ♦దానె గురుండు వినాయకుండు దాఁ
నేనుఁగురీతినుండియు న♦దేమిటికాఁడుఁడు పెండ్లి? భాస్కరా!

ఉ॥ కామితవస్తుసంపదలు ♦ గల్గు ఫలం బొరు లాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరి♦యేటికి నిష్ఫల మున్నఁబోయినన్
బ్రామికపడ్డ లోకులకుఁ ♦ బండఁగ నేమది యెండిపోవఁగా
నేమిఫలంబు చేఁదు విడ♦దెన్నటికైన ముసిండి భాస్కరా!

ఉ॥ కారణమైన కర్మములు•కాక దిగంబడ వెన్ని గొందులం
దూఱిన నెంతవారలకుఁ ; • దొల్లి పరీక్షితుశాపభీతుఁడై
వారిధి నొప్పు నుప్పరిగ•పైఁ బదిలంబుగ డాఁగియుండినం
గ్రూరభుజంగదంతహతిఁ•గూలఁడె లోకులెఱుంగభాస్కరా!

చ॥ కులముననక్కడక్కడన కుంఠితధార్మికుఁడొక్కఁడొక్కఁడే
కలిఁగెడుఁగాక పెందఱుచుఁ • గల్గఁగ నేరరు, చెట్టుచెట్టునన్
గలుఁగఁగనేర్చునే గొడుగు•కామలుచూడఁగనాడనాడనిం
పలరఁగనొక్కొకొక్కటిన•యంబునఁజేకుఱుఁగాక భా.

ఉ॥ క్రూరమనస్కులోపతులఁ • గొల్చి వసించిన మంచివారికిన్
వారిగుణంబెపట్టి చెడు•వర్తన వాటిలు, మాధురీజలో
ధారలు గౌతమీముఖమ•హానదు లంబుధిఁ గూడినంతనే
క్షారముఁజెందవే మొదలి • కట్టడలన్నియుఁ దప్పి భాస్కరా!

ఉ॥ గిట్టుట కేడఁ గట్టడలి•భించిన నచ్చుటఁగాని యొండుచోఁ
బుట్టదు చావు ; జానువుల•పున్కలనూడిచి కాశిఁ జావఁ గా
ల్గట్టినశూద్రకున్ భ్రమలఁ•గప్పుచుఁ దద్విధి గుజ్జమాచు నా
ట్టునఁగొంచు మజ్జికడఁ • బ్రాణము దీసెఁగదయ్య భా.

ఉ॥ ఘనబలసత్త్వ మచ్చుపడఁ•గల్గినవానికి హాని లేనిచోఁ
దనదగు సత్త్వమే చెఱుచుఁ • దన్నుఁ? నదెట్లన, నీరులావుగాఁ
గనువసియించినన్ జెఱువు•కట్టకు సత్త్వముచాలకున్నచోఁ
గనుమలుపెట్టి నట్టనడి•గండి తెగంబడకున్నె భాస్కరా!

చ॥ ఘనుఁడగునట్టివాఁడు నిజ♦కార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవుని ♦ బ్రార్థనఁజేయుట తప్పుగాదుగా;
యనఘతఁగృష్ణజన్మమున ♦ నావసుదేవుఁడుమీఁద బెత్తుగాఁ
గనుఁగొనిగానివానికడ♦కాళ్ళకు మ్రొక్కఁడెనాఁడుభాస్కరా!

చ॥ ఘనుఁ డొకవేళఁ గీడ్పడినఁ♦గ్రమ్మఱ నాతనిలేమి నాపఁగాఁ
గనుగొన నొక్కసత్ప్రభువు♦గాక నరాధములోప రెందఱుం
బెనుఁ జెఱు వెండినట్టితఱిఁ ♦ బెల్లునమేఘుఁడుగాక నీటితోఁ
దనుపఁదుషారముల్ శతశ♦తంబులుచాలునటయ్య భాస్కరా!

ఉ॥ చంద్రికళావతంసుకృప♦చాలనినాఁడు మహాత్ముఁడైనఁ దా
సాంద్రవిభూతిబాసి యొక♦జాతివిహీనునిగొల్చియుంట యో
గీంద్రనుతాంఘ్రిపద్మ! మతి♦హీనతనొందుట కాదుగా హరి
శ్చంద్రుఁడు వీరబాహుని ని♦జంబుగఁగొల్వఁడె నాఁడు భా.

ఉ॥ చక్కఁదలంపఁగా విధివ♦శంబున నల్పునిచేతనైనఁ దా
జిక్కి యవస్థలంబొరలుఁ ♦ జెప్పఁగరానిమహాబలాఢ్యుఁడు
న్మిక్కిలి సత్త్వసంపదల♦మీఱిన గంధగజంబు మావటీఁ
డెక్కియదల్చికొట్టికుది♦యించిననుండదెయోర్చిభాస్కరా!

చ॥ చదువది యెంతకల్గిన ర♦సజ్ఞత యించుకచాలకున్న నా
చదువునిరర్థకంబు గుణ♦సంయుతులెవ్వరుమెచ్చ రెచ్చటం
బదనుగ మంచికూర నల ♦ పాకముచేసిననైన నందు నిం
పొదవెడు నుప్పులేక రుచి♦పుట్టఁగనేర్చునటయ్య భాస్కరా!

ఉ॥ చాలఁ బవిత్రవంశమున • సంజనితుం డగునేని యెట్టిదు
ర్శీలునినైనఁ దత్కులవి • శేషముచే నొకపుణ్యుఁ డెంతయున్
దాలిమి నుద్ధరించును సు • ధానిధిఁ బుట్టఁగఁ గాదె శంభుఁ డా
హాలహలానలంబుఁ గళ • మందు ధరించుట పూని భాస్కరా!

ఉ॥ చేరి బలాధిపుం డెఱిఁగి • చెప్పిన కార్యము చేయకుండినన్
పారము ముట్టలేఁ డొకని • పంపునఁ దాఁ జెడు నెట్టిధన్యుఁడు
న్నోరక పాండుపుత్త్రులకు • భూస్థలిభాగము పెట్టుమన్న కం
సారిని గాకుచేసి చెడఁ • డాయెనె కౌరవభర్త భాస్కరా!

ఉ॥ చేసిన దుష్టచేష్ట నది • చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చి తా
మూసినయంతటన్ బయలు • ముట్టకయుండదదెట్లు రాగి పైఁ
బూసిన బంగరుం జెదరి • పోవఁగడంగిన నాఁడు నాటికిన్
దాసినరాగి గానఁబడ • దా జనులెల్ల నెఱుంగ భాస్కరా!

చ॥ తగిలి మదంబుచే నెదిరిఁ • దన్ను నెఱుంగక దొడ్డవానితోఁ
బగఁగొనిపోరుటెల్ల నతి • పామరుఁడై చెడు టింతెకాక తా
నెగడి జయింపనేరఁ డది • నిక్కము తప్పదు; ధాత్రిలోపల
న్నగి యొకకొండతోఁ దగరు • దీకొని తాఁకిననేమి భాస్కరా!

చ॥ తడవఁగరాదు దుష్టగుణుఁ • దత్వమెఱుంగక యెవ్వరైన నా
చెడుగుణ మిట్లు వల్వదని • చెప్పినఁ గ్రిక్కునఁ గోపచిత్తుఁడై
కడుఁ దెగఁ జూచుఁ గా మఱుఁగఁ • గాఁగిన తైలము నీటిబొట్టు పైఁ
బడునెడ నాక్షణం బెగసి • భగ్గునమండక యున్నె భాస్కరా!

చ॥ తనకు ఫలంబులేదని యెదం దలపోయఁడు కీర్తిఁగోరు నా
ఘనగుణశాలి లోకహితకార్యము మిక్కిలి భారమైన మే
లనుకొనుఁ బూను; శేషుఁడు సహస్రముఖంబులఁ గాలి కోర్చి తా
ననిశము మోవఁడే మఱి మహాభరమైన ధరిత్రి భాస్కరా!

చ॥ తనకు నదృష్టరేఖ విశదంబుగఁ గల్గినఁగాని లేనిచో
జనునకు నెయ్యెడన్ బరుల సంపదవల్ల ఫలంబు లేదుగా
కనుఁగవ లెస్సఁగాఁ దెలివి గల్గినవారికిఁ గాక గ్రుడ్డికిన్
కనుపడు నెట్లు వెన్నెలలు గాయఁగ నందొకరూపు భాస్కరా!

ఉ॥ తాలిమితోడుతం దగవు తప్పక నేర్పరి యొప్పుఁ దప్పులం
బాలనసేయుఁ గాక కట నుపాయవిహీనుఁడు సేయనేర్చునే?
పాలను నీరు నేఱుపఱుపంగ మరాళ మెఱుంగుఁ గాని మా
ర్జాల మెఱుంగునే తదురుచారురసజ్ఞతఁ బూన భాస్కరా!

ఉ॥ తాలిమితోడఁ గూరిమిఁ గృతఘ్నునకెయ్యెడ నుత్తమోత్తము
ల్మేలొనరించినన్ గుణము మిక్కిలి కీడగుఁ బాముపిల్లకున్
బాలిడి పెంచిన న్విషము పాయఁగ నేర్చునె దానికోఱలం
జాలఁగ నంతకంత కొకచాయను హెచ్చునుగాక భాస్కరా!

చ॥ తెలియని కార్యమెల్లఁ గడతేర్చుట కొక్క వివేకిఁ జేకొనన్
వలయు నతైన దిద్దుకొన వచ్చుఁ బ్రయోజనమాంద్యమేమియు
న్గలుగదు ఫాలమందుఁ దిలకం బిడునప్పుడు చేత నద్దముం
గలిగినఁ జక్కఁ జేసికొనుఁ గాదె నరుం డది చూచి భాస్కరా!

ఉ॥ దక్షుఁడు లేనియింటికిఁ బ♦దార్థము వేఱొకచోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బ♦లాయనమైచనుఁ గల్లగాదు, ప్ర
త్యక్షము వాఁగులు న్వఱద♦లన్నియువచ్చిన నీరునిల్చునే
యక్షయమైనగండి తెగి♦నట్టితటాకములోన భాస్కరా! 53

ఉ॥ దానపరోపకారగుణ♦ధన్యత చిత్తములోన నెప్పుడున్
లేని వివేకశూన్యునకు ♦ లేములు వచ్చినవేళ, సంపదల్
పూనినవేళ నొక్కసరి♦పోలును జీకున కర్థరాత్రియం
దైన నదేమి పట్టపగ♦లైన నదేమియు లేదు భాస్కరా! 54

ఉ॥ దానము సేయఁగోరిన వ♦దాన్యున కీయఁగ శక్తిలేనిచో
నైనఁ బరోపకారమున♦కై యొకదిక్కునఁ దెచ్చియైన నీఁ
బూనును మేఘుఁడంబుధికిఁ♦బోయిజలంబులఁ దెచ్చియీయఁడే
వాన సమస్తజీవులకు ♦ వాంఛిత మింపెసలార భాస్కరా!

ఉ॥ దానముచేయనేరని య♦ధార్మికుసంపద యుండియుండియున్
దానెపలాయనంబగుట♦తథ్యము; బూరుగుమ్రానుగాచినన్
దానిఫలంబు లూరక వృ♦థా పడిపోవవె యెండి గాలిచేఁ
గానలలోన నేమిటికిఁ♦గాక యభోజ్యములౌట భాస్కరా! 56

చ॥ నడవక చిక్కి లేమియగు♦నాఁడు నిజోదరపోషణార్థమై
యడిగి భుజించుట ల్నరుల♦కారయ వ్యంగ్యముకాదు పాండవు
ల్గడుబలశాలులేవురు న♦ఖండవిభూతిఁదొలంగి భైక్ష్యముల్
గుడువరె యేకచక్రపురిఁ ♦ గుంతియుఁ దా రొకచోట భా.

చ॥ నుడువులనేర్చుచాలనిమ•నుష్యుఁ డెఱుంగక తప్పనాడినన్
గడుఁగృపతోఁ జెలంగుదురు•కాని యదల్పరు తద్జ్ఞులెల్లఁద
ప్పడుగులు వెట్టుచున్నడచు•నప్పుడు బాలునిముద్దుసేయఁగాఁ
దొడగుదు రింతెకాని పడఁ•ద్రోయుదురే యెవరైన భా.

ఉ॥ నేరిచి బుద్ధిమంతుఁ డతి•నీతివివేకముఁ దెల్పినం జడం
గారణమున్న వాని కది•కైకొనఁగూడదు నిక్కమే దురా
చారుఁడురావణాసురుఁ డ•సహ్యమునొందఁడెచేటుకాలముం
జేరువయైననాఁడు నిర•సించి విభీషణుబుద్ధి భాస్కరా! 59

చ॥ నొగిలినవేళ నెంతటిఘ•నుండును ద న్నొక రొక్కనేర్పుతో
నగపడి ప్రోదిసేయక త•నంతట బల్మికిరాఁడు నిక్కమే
జగమున నగ్నియైనఁ గడు•సన్నగిలంపడియున్న నింధనం
బెగయఁగఁద్రోచి యూదక మ•రెట్లు రవుల్కొననేర్చు భా.

ఉ॥ పండితులైనవారు దిగు•వం దగనుండఁగ నల్పుఁడొక్కఁ డు
ద్దండతఁ బీఠమెక్కిన బు•ధప్రకరంబుల కేమియెగ్గగున్?
గొండొకకోఁతిచెట్టుకొన•కొమ్మలనుండఁగఁ గ్రింద గండభే
రుండమదేభసింహనికు•రుంబము లుండవె? చేరి భాస్కరా!

ఉ॥ పట్టుగనిక్కుచు న్మదముఁ•బట్టి మహాత్ములఁ దూలనాడినం
బట్టినకార్యముల్ చెడును•ప్రాణముపోవు నిరర్థదోషముల్
పుట్టు మహేశుఁగాదని కు•బుద్ధినొనర్చిన యజ్ఞతంత్రము
ల్మట్టకపోయి దక్షునికి•మోసమువచ్చెగదయ్య భాస్కరా!

చ॥ పరహితమైనకార్య మతి•భారముతోడిదిదుర్గమైనఁ బూను స
త్పురుషుఁడులోకముల్పొగడఁ•బూర్వమునందొక కాలవర్షము
న్గురియఁగఁ జొచ్చిన న్గడిసి • గొబ్బున గోజనరక్షణార్థమై
గిరి నొక కేల నెత్తెనట • కృష్ణుఁడు ఛత్రముభాతి భాస్కరా!

చ॥ పలుచనిహీనమానవుఁడు • పాటిఁదలంపక నిష్ఠురోక్తులన్
బలుకుచునుండుఁగానిమతి•భాసురుఁడై నగుణప్రపూర్ణుఁడ
ప్పలుకులఁబల్కఁబోవఁడు ని•బద్ధిగ నెట్లన వెల్తికుండ దాఁ
దొలఁకుచునుండుఁగాని మఱి•తొల్కునె నిండుఘటంబుభా.

చ॥ పలుమఱు సజ్జనుండు ప్రియ•భాషలెపల్కుఁ గఠోరవాక్యము
ల్బలుకఁ డొకానొకప్పు డవి•పల్కిన గీడునుగాదు నిక్కమే
చలువకువచ్చి మేఘుఁ డొక•జాడను దా వడగండ్ల రాల్చిన
న్శిలలగునోటు వేగిరమె • శీతలనీరము గాక ! భాస్కరా !

ఉ॥ పాపపుఁ దోవవాని కొక•పట్టున మేను వికాస మొందినన్
లోపల దుర్గుణంబె ప్రబ•లుంగద! నమ్మఁగఁ గూడ దాతనిన్
బాపటకాయకున్ నునుపు • పైపయిఁ గల్గినఁగల్గుగాక నే
రూపున దానిలోఁగల వి•రుద్ధపుఁజేదు నశించు భాస్కరా!

ఉ॥ పూనిన భాగ్యరేఖచెడి•పోయినపిమ్మట నెట్టిమానవుం
డైనను వాని నెవ్వరుబ్రి•యంబునఁ బల్కరు పిల్వ రెచ్చటన్
దానిది యెట్లొకోయనినఁ • దథ్యము పుష్పము వాడి వాసనా
హీనతనొందియున్న యెడ • నెవ్వరు ముట్టుదురయ్య? భా.

ఉ॥ పూరితసద్గుణంబుగల • పుణ్యున కించుకరూపసంపదల్
దూరములైన వానియెడ • దొడ్డగఁ జూతురు బుద్ధిమంతు లె
ట్లారయ గొగ్గులైన మఱి • యందుల మాధురిఁ జూచికాదె
ఖర్జూరఫలంబులం బ్రియము•చొప్పడ లోకులు గొంట భా.

ఉ॥ ప్రల్లదనంబుచే నెఱుక•పాటొకయింతయులేక యెచ్చటన్
బల్లిదుఁడైన సత్ప్రభుని•బద్ధములాడినఁ ద్రుంగిపోదు, రె
ట్లల్లసభాస్థలిం గుమతు•లై శిశుపాలుఁడు దంతవక్త్రుఁడున్
గల్లలు గృష్ణునిం బలికి•కాదె హతంబగుటెల్ల భాస్కరా! 69

ఉ॥ ప్రేమనుగూర్చి యల్పునకుఁ • బెద్దతనంబును దొడ్డవానికిం
దా మతితుచ్ఛపుంబని నెదం బరికింపక యీయరాదుగా;
వామకరంబుతోడఁ గుడు•వం గుడిచేత నపానమార్గముల్
దోమఁగవచ్చునే మిగులఁ • దోఁచనిచేఁతలుగాక భాస్కరా!

చ॥ ఫలమతిసూక్ష్మమైననునృ•పాలుఁడుమంచిగుణాఢ్యుఁడైన-చో
నెలమి వివేకు లాతని క•పేక్షయొనర్తు; రదెట్లు చంద్రికా
విలసనమైనఁ దా మనుభ•వింపఁ జకోరము లాసఁ జేరవే
చలువగలట్టివాఁడగుటఁ • జందురు నెంతయుఁగోరి భా.

ఉ॥ బంధురసద్గుణాఢ్యుఁ డొక•పట్టున లంపటనొందియైన దు
స్పంధిఁ దలంపఁ డన్యులకుఁ•జాలహితంబొనరించుఁగాక శ్రీ
గంధపుఁజెక్క రాగిలుచుఁ•గాదె శరీరుల కుత్సవార్థమై
గంధములాత్మఁబుట్టఁదఱు•గంబడియుండుటెల్లభాస్కరా!

చ॥ బలముదొలంగుకాలమునఁ ♦ బ్రాభవసంపద లెంతధన్యుఁడు
న్నిలుపుకొనంగనోపఁ; డది♦నిశ్చయ మర్జునుఁ డీశ్వరాదులం
గెలిచినవాఁడుబోయలకుఁ♦గీడ్పడిచూచుచుఁగృష్ణుభార్యలం
బలువుర నీయఁడే నిలుపఁ♦బట్టసమర్థుఁడుగాక భాస్కరా!

చ॥ బలయుతుఁడైనవేళ నిజ♦బంధుఁడు తోడ్పడుగాని యాతఁడే
బలముఁ దొలంగెనేని తన♦పాలిటి శత్రు;వదెట్లు పూర్ణుఁడై జ్వ
లనుఁడు కానఁ గాల్చుతఱి♦సఖ్యముఁజూపునువాయుదేవుఁడా
బలియుఁడు సూక్ష్మదీపమగు♦పట్టుననార్పఁడెగాలిభాస్కరా!

ఉ॥ బల్లిదుఁడైన సత్ప్రభువు ♦ బాయకయుండినఁగాని రచ్చలోఁ
జిల్లరవారు నూఱుగురు ♦ సేరినఁ దేజము గల్గ దెయ్యెడన్
జల్లని చందురుం డెడసి ♦ సన్నఁపుఁజుక్కలు కోటియున్న రం
జిల్లునె వెన్నెలల్జగము♦చీఁకటులన్నియుఁ బాయ భాస్కరా!

చ॥ భుజబలశౌర్యవంతులగు♦పుత్త్రులఁగాంచినవారి కెయ్యెడన్
నిజహృదయేప్సితార్థములు ♦ నిక్కము చేకుఱుఁ గుంతిదేవికె
న్విజయబలాఢ్యుఁ డర్జునుఁడు ♦ వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లివ్రత♦కార్యముఁదీర్పఁడెతొల్లిభాస్కరా!

ఉ॥ భూనుతులైన దేవతలు ♦ పూర్వముకొందఱు వావివర్తనల్
మాని చరింపరో యనుచు ♦ మానవులట్లు చరింపఁబోల దం
భోనిధులన్నియుం దనదు♦పుక్కిటఁ బట్టె నగస్త్యుఁడంచు నా
పూనిక కెవ్వఁడోపు నది♦పూర్వమహత్త్వముసుమ్ము భా.

ఉ॥ భూపతి కాత్మబుద్ధి మదిఁ◆బుట్టనిచోటఁ బ్రధాను లెంతప్ర
జ్ఞాపరిపూర్ణులైనఁ గొన◆సాగదు కార్యము కార్యదక్షులై
యోపిన ద్రోణభీష్మకృప◆యోధు లనేకులుగూడి కౌరవ
క్ష్మాపతికార్యమేమయినఁ◆జాలిరె! చేయఁగవారు భాస్కరా!

ఉ॥ భూరిబలాఢ్యుఁడైనఁ దల◆పోయక విక్రమశక్తిచే సహం
కారమునొందుటల్ తగవుఁ◆గాదతఁడొక్కెడమోసపోవుఁగా
వీరవరేణ్యుఁ డర్జునుఁడు ◆ వింటికి నే నధికుండనంచుఁ దా
నూరక వింటి నెక్కుడఁగ ◆ నోపఁడు కృష్ణుఁడులేమిభాస్కరా!

ఉ॥ భ్రష్టున కర్థవంతులగు ◆ బాంధవు లెందఱు గల్గినన్ నిజా
దృష్టము లేదు గావున ద◆రిద్రతఁ బాపఁగలేరు ; సత్కృపా
దృష్టినినిల్పి లోకుల క◆తిస్థిరసంపదలిచ్చు లక్ష్మి యా
జ్యేష్ఠ కదేటికింగలుఁగఁ◆జేయదు తోడనె పుట్టి భాస్కరా !

చ॥ మదిఁ దను నాసపడ్డయెడ◆మంచిగుణోన్నతుఁ డెట్టిహీనుని
న్వదలఁడు మేలుపట్టున న◆వశ్యము మున్నుగనాదరించుఁగాఁ
ద్రిదశవిమానమధ్యమున దెచ్చి◆కృపామతి సారమేయము
న్మొదలనిడండెధర్మజుఁడు◆మూఁగిసురావళిచూడభాస్కరా!

ఉ॥ మాటలకోర్వఁజాలఁడభి◆మానసమగ్రుఁడు ప్రాణహానియౌ
చోటులనైనఁ దా నెదురు◆చూచుచునుండుఁ గొలంకులోపల
న్నీట మునింగినప్పు డతి◆నీచములాడిన రాజరాజు పో
రాటమొనర్చి నేలఁబడఁ◆డాయెనె భీమునిచేత భాస్కరా !

ఉ॥ మానవనాథుఁ డాత్మరిపు•మర్మ మెఱింగినవాని నేలినం
గాని జయింపలేఁ డరులఁ•గార్యకదక్షుఁడు రామభద్రుఁడా
దానవనాయకున్ గెలువఁ•దానెటులోపుఁ దదీయనాభికా
స్థానసుధన్ విభీషణుఁడు•తార్కొని చెప్పకయున్న భా. 83

ఉ॥ మానవుఁడాత్మకిష్టమగు•మంచిప్రయోజనమాచరించుచోఁ
గానక యల్పుఁ డొక్కఁ డెది•గాదనిపల్కిన వానిపల్కుకై
మానఁగఁజూడఁ డాపని స•మంచితభోజనవేళ నీఁగ కా
లూనిన వంటకంబు దిన•కుండఁగఁ నేర్చునె నోట భాస్కరా!

ఉ॥ మానిని చెప్పిన నెఱుక•మాలినవాఁ డటుచేసినన్ మహా
హాని ఘటించు నే ఘనుని•కైన నసంశయ ముర్విపైఁ గృపా
హీనతఁ బల్కినన్ దశర•థేశ్వరుఁ డంగనమాటకై గుణాం
భోనిధి రాముఁ బాసి చని•పోవఁడె శోకముతోడ భాస్కరా!

చ॥ మునుపొనరించుపాతకము•మోఘముజీవుల కెల్లఁబూని యా
వెనుకటిజన్మమం దనుభ•వింపకతీఱదు; రాఘవుండు వా
లిని బడనేసి తా మగుడ•లీల యదూద్భవుఁడై కిరాతుచే
వినిశితబాణపాతమున•వీడ్కొనఁడే తనమేను భాస్కరా!

ఉ॥ రాకొమరుల్ రసజ్ఞుని ది•రంబుగ మన్ననునుంచినట్లు భూ
లోకమునందు మూర్ఖుఁదమ•లోపలనుంపరు; నిక్కమేకదా!
చేకొని ముద్దుగాఁ జదువు•చిల్కను బెంతురెగాక! పెంతురే?
కాకమునెవ్వరైన శుభ•కారణ సన్మునిసేవ్య భాస్కరా!

ఉ॥ లోకములోన దుర్జనులలోఁతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు చేరెనం గవయ◆జూతురు చేయుదు రెక్కసక్కెముల్
కోకిలఁగన్నచోట గుమి◆గూడియసహ్యపుఁగూఁతలార్చుచు
న్కాకులు తన్నవే తఱిమి◆కాయము తల్లడమంద భాస్కరా!

ఉ॥ లోనుదృఢంబుగాని తను◆లోభిని నమ్మి యసాధ్యకార్యముల్
కానక పూనునే నతఁడు◆గ్రక్కునఁ గూలును నోటిపుట్టిపై
నూనవుఁ జెక్కపోవ నొ◆కమాటు బుటుక్కున ముంపకుండునే
తా నొకలోఁతునం గెడసి◆దానిఁ దరింపఁగలేక భాస్కరా !

ఉ॥ వంచనయింతలేక యొక◆వంటిమహాత్ములనాశ్రయించినం
గొంచెముకాని మేలు సమ◆కూడ దదృష్టములేనివారికిఁ
సంచితబుద్ధి బ్రహ్మ నని◆శంబును వీపున మోచునట్టి రా
యంచకుఁ దమ్మితూండ్లు దిన◆నాయెఁగదా ఫలమేమి భా.

వట్టిచుఁ దండ్రి యత్యధమ◆వర్తనుఁడైనను గానివానికిం
బుట్టినపుత్త్రికుండు తన◆పుణ్యవశంబున దొడ్డ ధన్యుఁడౌ
నెట్టన మఱ్ఱివిత్తు మును◆పెంతయుఁ గొంచెము దానఁ బుట్టి నా
చెట్టు మహోన్నతత్వమును◆జెందదె శాఖలనిండి భాస్కరా!

చ॥ వలనుగఁ గానలందుఁ బ్రతి◆వర్షమునం బులి నాలుగైదు పి
ల్లలఁగను జూడ నొక్కటి ని◆లంగను ధేనువు రెండు మూఁడు నేఁ
డులకటులైన బెబ్బులికు◆టుంబములల్పములాయె నాలమం
దలు గడువృద్ధిఁ జెందవె య◆ధర్మము ధర్మముఁ దెల్ప భా.

చ॥ వలవదు క్రూరసంగతి య♦వశ్య మొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియెకాక యెక్కువలు♦గూడవు తమ్ములపాకులోపలం
గలసిన సున్నమించుకయ♦కాక మఱించుకయెక్కువైనచో
నలుగడఁ జుఱ్ఱుచుఱ్ఱుమని♦నాలుకపొక్కకయున్నె భాస్కరా!

ఉ॥ వానికి విద్యచేత సిరి ♦ వచ్చె నటంచును విద్య నేర్వఁగాఁ
బూనినఁ బూనుఁగాక తన♦పుణ్యముచాలక భాగ్యరేఖకుం
బూనఁగనెవ్వఁడోపు సరి♦పో; చెవిపెంచునుగా కదృష్టతా
హీనుఁడు కర్ణభూషణము ♦ లెట్లు గణింపగనోపు భాస్కరా!

ఉ॥ సంతతపుణ్యశాలి నొక♦జాడను సంపద వాసిపోయి తా
నంతటఁబోక నెట్టుకొని♦యప్పటియట్లువసించియుండు, మా
సాంతములందుఁ జందురుని ♦ సన్నికళల్ పెడఁబాసిపోయినం
గాంతివహింపఁ డోటు తిరు♦గంబడి దేహమునిండ భాస్కరా!

చ॥ సకలజనప్రియత్వము ని♦జంబుగఁ గల్గిన పుణ్యశాలి కొ
క్కొకయెడ నాపదైనఁ దడ♦వుండదు వేగమె పాసిపోవుగాఁ
యకలుషమూర్తియైన యమృ♦తాంశుఁడు రాహువు తన్ను
మ్రింగినం,దకటకమూనియుండఁడె? దృ♦ణస్థితినెప్పటియట్లభా.

ఉ॥ సన్నుతకార్యదక్షుఁ డొక♦చాయ నిజప్రభ యప్రకాశమై
యున్నపుడైన లోకులకు ♦ నొండొకమేలొనరించు సత్వసం
పన్నుఁడు భీముఁడాద్విజుల♦ప్రాణము కావఁడె యేకచక్రమం
దెన్నికఁగా బకాసురుని ♦ నేపున రూపఁడగించి భాస్కరా!

చ॥ సరసగుణప్రపూర్ణునకు ♦ సన్నపుదుర్గుణ మొక్కవేళయం
దొరసిన నిట్లు నీకుఁదగు♦నో యని చెప్పిన మాననేర్చుఁగా
బురద యొకించుకంత తముఁ ♦ బొందినవేళలఁ జిల్లవిత్తుపై
నొరసిన నిర్మలత్వమున♦నుండవె నీరములెల్ల భాస్కరా! 98

చ॥ సరసదయాగుణంబుగల♦జాణమహింగడునొచ్చియుండియుం
దఱుచుగ వాని కాసపడి ♦ డాయగవత్తురు లోకులెట్లనం
జెఱకురసంబు గానుగను ♦ జిప్పిలిపోయినమీఁదఁ బిప్పియై
ధరఁబడియున్నఁ జేరవె ము♦దంబున జీమలు పెక్కు భా. 99

ఉ॥ సారవివేకవర్తనల ♦ సన్నుతికెక్కినవారిలోపలం
జేరినయంత మూఢులకుఁ♦జేపడ దానడ; యెట్లు లన్నఁగా
సారములోన హంసముల♦సంగతినుండెడి కొంగపిట్ట కే
తీరునఁ గల్గనేర్చును ద♦దీయగతుల్ దలపోయ భాస్కరా!

ఉ॥ స్థానము తప్పివచ్చునెడఁ ♦ దా నెటువంటి బలాఢ్యుఁడున్ నిజ
స్థానికుఁడైన యల్పునిక♦తంబుననైనను మోసపోవుఁగా
కానలలోపలన్ వెడలి ♦ గంధగజం బొకనాఁడు నీటిలోఁ
గానక చొచ్చినన్ మొసలి♦కాటునలోఁబడదోటుభాస్కరా!

చ॥ సిరిగలవాని కెయ్యెడలఁ ♦ జేసిన మేలది నిష్ఫలం బగున్
నెఱిగుఱిగాదు పేదలకు ♦ నేర్పునఁ జేసిన సత్ఫలం బగున్
వఱపున వచ్చి మేఘుఁడొక♦వర్షము వాడిన చేలమీఁదటం
గురిసినఁగాక యంబుధులఁ♦గుర్వగ నేమి ఫలంబుభాస్కరా!

చ॥ సిరివలెనేని సింహగుహ•చెంత వసించినఁ జాలు సింహముల్
కరుల వధింపఁగా నచట•గల్గును దంతచయంబు ముత్యముల్
హరువుగ నక్కబొక్కకడ • నాశ్రయమందిన నేమిగల్గెడుం
గొరిసెలు దూడతోకలును • గొమ్ములు నెమ్ములుగాక భా.

చ॥ స్థిరతరధర్మవర్తనఁ బ్ర•సిద్ధికి నెక్కినవాని నొక్క ము
ష్కరుఁడతినీచవాక్యములఁ•గాదనిపల్కిననమ్మహాత్ముఁడుం
గొఱతవహింపఁడెయ్యెడ; న•కుంఠితపూర్ణసుధాపయోధిలో
నరుగుచుఁగాకిరెట్టయిడి•నందున నేమికొఱంత? భాస్కరా!

చ॥ స్ఫురతరకీర్తిమంతులగు • పుత్రులఁగాంచినఁగాక మూఢము
ష్కరులఁ గనంగఁ దేజ•ములు గల్గవుగా? మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శు•భస్థితిఁ బెట్టినఁగాక గాజుటుం
గరములు పెట్టినందున వి•కాసముగల్గునటయ్య? భాస్కరా!

ఉ॥ సేనగవాంఛితాన్నము భు•జింపఁగలప్పుడు కాక లేనిచో
మేనులుడస్సియుంటనిజ•మేకద దేహుల కగ్నిహోత్రుఁడో
నే నిజభోజ్యముల్ గుడుచు•నేనియుఁ బుష్టివహించు లేనినాఁ
డూనివిభూతిలోనడఁగి•యుండఁడెఁ దేజముతప్పి భాస్కరా!

ఉ॥ హాళినిజప్రబుద్ధి తిర•మైనవిధంబునఁ బెట్టుబుద్ధు లా
వేళల కంతెకాని మఱి•వెన్కకు నిల్వవు; హేమకాంతి యె
న్నాళులకుండుఁగాని యొక•నాఁడుపదంపడి సానఁబట్టినన్
దాళుకయుండునే యినుప•తాటకుఁజాయలుపోక భాస్కరా!

ఉ॥ హీనకులంబునందు జని•యించినవారికి సద్గుణంబు లె
న్నేనియుగల్గియున్ననొక•నేరము చెందకపోదు ; పద్మముల్
భానునిఁగాంచియున్ బురదఁ•బుట్టుటవల్ల సుధాకరోదయం
బైన నసహ్యమొందవె • ప్రియంబునఁజూడఁగలేక భాస్కరా!

ఉ॥ ఇంచుక నేర్పుచాలక వి•హీనతఁజెందిన నాకవిత్వముల్
మించువహించె నీకతన•మిక్కిలి యెట్లనఁ దోలుబొమ్మలన్
మంచివివేకివాని తెర•మాటుననుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే జనుల • డెందము నింపవె ప్రీతి భాస్కరా!

సంపూర్ణము.



# రాఘవరామ్ అండ్ కో., బెజవాడ.

## స్వంత ప్రచురణములు.

| | | | |
|---|---|---|---|
| రాఘవ బాలశిక్ష | | ... ... | 0—1—6 |
| రాఘవవాచకములు | మొదటితరగతి | ... | 0—2—6 |
| డిటో | రెండవతరగతి | ... | 0—3—0 |
| డిటో | మూడవతరగతి | ... | 0—4—0 |
| డిటో | నాలుగవతరగతి | ... | 0—5—0 |
| డిటో | అయిదవతరగతి | ... | 0—6—0 |
| డిటో | ఆఱవతరగతి | ... | 0—7—0 |
| డిటో | ఏడవతరగతి | ... | 0—8—0 |
| డిటో | ఎనిమిదవతరగతి | ... | 0—8—0 |
| రాఘవ ఆంగ్లో తెలుగుప్రైమరు | | ... | 0—2—6 |
| రాఘవ ఆంగ్లో తెలుగుగ్రామరు (For Beginners) | | | 0—4—0 |
| రాఘవ కాన్వర్ సేషనల్ లెసన్సు (In English) | | ... | 0—4—0 |
| రుక్మిణీ కల్యాణం (మూలము) | | ... ... | 0—2—6 |
| డిటో | టీకాతాత్పర్య సహితము | ... ... | 0—6—0 |
| భాస్కరశతకము (మూలము) | | ... ... | 0—1—0 |
| డిటో | టీకాతాత్పర్య సహితము | ... ... | 0—4—0 |
| దాశరథి శతకము (మూలము) | | ... ... | 0—1—0 |
| డిటో | టీకాతాత్పర్య సహితము | ... ... | 0—4—0 |
| కృష్ణశతకము (మూలము) | | ... ... | 0—1—0 |
| డిటో | టీకాతాత్పర్య సహితము | ... ... | 0—3—0 |
| సుమతి శతకము (మూలము) | | ... ... | 0—1—0 |
| డిటో | టీకాతాత్పర్య సహితము | ... ... | 0—2—0 |
| గణితబోధిని | | ... ... | 0—1—0 |

ఇంకను మావద్ద సమస్త సంస్కృతాంధ్ర హిందీ పుస్తకములు, అన్నిరకముల స్టేషనరీ సామానులు సరసమైన ధరలకు దొరకును.

